4063

శ్రీరస్తు

శ్రీ పార్వతీ పరమేశ్వరాయ నమః.

# శ్రీ సీమంతిని.

[ గురువారవ్రత మాహాత్మ్యము ]

## శివపూజావిధాన సహితము.


గ్రంథకర్త:

లక్కాన మల్లికార్జునుడు,

ఉపాధ్యాయుడు, బోర్డు ఎలిమెంటరీ స్కూలు,

...పాలెము, తోట్లవల్లూరుపోస్టు.





బెజవాడ:

...మ్మ ముద్రాక్షరశాలయందు

...య్యగారిచే ముద్రింపబడియె.

1936




[వెల 2 అణాలు.

శ్రీరస్తు

శ్రీ గురవేనమః

# శ్రీ సీమంతిని.

కృత్యాది.

శ్రీ రజతాద్రినికేతన!
సారసదళనయన! పాపచయ శోషణ! బృం
దారకసేవిత చరణా!
గౌరీ హృత్పద్మహంస! కరము భజింతున్.

ఎప్పని సేయదలంచిన
నప్పని నిర్విఘ్నముగను నగుటకు దొలుతన్
తప్పక కొలుతు రెవని నా
యప్పను, విఘ్నేశు దలతు నమలమనీషన్.

అకలుషమతి నే దేవిని
ప్రకటితముగ సేవజేయ రాట్సభవైనన్
సుకరముగ బూజ గను, నా
యకలంకగుణాఢ్య శారదాంబను దలతున్.

కరిబసవా! అపరశివా!
మరి మరి నుతియింపుచుందు మరువక యెపుడున్
గురువర కారుణ్యముతో
నిరతము రక్షింపుమయ్య నిర్మలమూర్తీ

దరి గన నేర కెందు భవ తాపభయంబున గుందుచుండగా
దరిని బడంగ జేతు నని తాపసిరూపము దాల్చి వేగమే
దరికి గనంగవచ్చి యిల ధర్మము దెల్పి జనాళి బ్రోవ వే
కరిబసవా! నిజంబుగను కామితదాయివి నిన్భజించెదన్.

నన్నయ దిక్కనకవి వి
ద్వన్నుతు బోతనకవీంద్రు భాస్కరసుకవిన్
జెన్నలరారగ నెద నిడి
సన్నుతులం జేయువాడ సదమలభక్తిన్

చదు వెఱుగనినను నాదర
మొదవంగా జేరదీసి యోపినకొలదిన్
చదివించి బుద్ధిగరపివ
సదమలమతి, జంద్రమౌళిసద్గురు నెంతున్

కన్నబిడ్డగ ననుగాంచి కరుణనించి
విద్యగరపిన గుణధుర్యు విప్రవర్యు
మద్గురూత్తంసు ఋణము దీర్పంగగలనె
దాని కర్పింతు నిపుడు వందనశతంబు.

కథారంభము.

శ్రీసద్గుణగణాలంకారమూర్తీ! మద్గురూత్తమా! చంద్ర
మౌళీశ్వరా! యవధరింపుడు.

చ॥ హరునకు నర్ధదేహమయి యాహ్హరివక్షమునందు లక్ష్మివై
హరిసుతువాక్కునం దమరి యాయమరావళికెల్ల తల్లివై

పరమపతివ్రతామణులపాలిట గల్పకవృక్షరాజమై
వర లెడు మూలకారణీ! కృపాంబుధీ! పాలనసేయవే దయన్

మాతంగ మందార చూత నారికేళ జంబు జంబీరా శోక శాండిల్య పిప్పల కింశుక తింత్రిణీ రసాలాది ఫలవృక్ష సమృద్ధంబై, శుకపికకోకిల బక నీలకంఠాది శకుంత సంతానాశ్రయంబై, శరభశార్దూల ఖడ్గ భల్లూక సింహ సారంగాది మృగసంకుల నిలయంబై, కపిలమార్కండేయ కౌశికాదిము నీశ్వరనివాసంబై,ముక్తి నిధానంబై తనరారు నైమిశారణ్యంబునం దొకానొకసమయంబున శౌనకాది మహామునులు రోమ హర్షణపుత్రుండైన సూతుం గని, "దేవా! నీకరుణాకటాక్షంబున శ్రీశుదయాపాత్రంబు లగు పుణ్యవ్రతంబు లెన్నియో తెలిసికొంటిమి. భక్తరక్షకుండగు భవానీపతి మదిమెచ్చు వ్రతరాజం బెద్దియేని కలదేని తద్విధానంబు సవిస్తరంబుగ మాకెరింగించి మము ధన్యులం జేయవే యని యడిగిన, నిఖిల పురాణకథాకథకుం డగుసూతుండు సంతసించి యిట్లనియె.

మునితిలకులారా! యాక్షితియం దేమానవుండైన నిర్మలభక్తియుక్తంబుగ భక్తవత్సలుండును, ముక్తిదాయకుండును నగు పార్వతీపతిం ధ్యానించి పూజాదివిధు లొనర్చిన నిలపై సమస్తైశ్వర్యంబులం బొందుచు నంతమందు నిందుధరు దయకు బాత్రుండ య్యెడును. అప్పరమేశ్వరారాధనవిధానంబు పలు తెరంగుల నలరారుచుండు. అవ్వ్రతంబులం దుత్తమోత్త మంబగునది సోమవారవ్రతంబు. తద్వ్రతమాహాత్మ్యంబు దలంప సహస్రఫణునకైన దరంబుగాదు. అయిన నాయిందు

కాశాధరుపై గల భక్తిపెంపున మహిమావిశేషంబుగల తద్వ్రత విధానంబు సవిస్తరంబుగ దెల్పెద, మీరలు నిర్మలచిత్తులై యాకర్ణింపుడు.

మునీంద్రులారా! తొల్లి యార్యావర్తదేశంబునందు గాళిందీతీరంబునం గల యొకరాజధానిని చిత్రవర్మ యను రాజు పాలించుచుండెను. అత డతిశివభక్తియుతుండై నిత్య సత్యదీక్షంబూని ధర్మంబు నాలుగు పాదంబుల నడుపుచు ప్రజారంజకంబుగా బాలనంబుసేయుచు క్షితిపతుల తలమానిక మనుకీర్తిని బడయుచుండె. మరియును గుణఖను లనదగు పుత్రరత్నంబుల నెనమండ్రం గనియె. కాని పుత్రికాసంతానంబు లేమికి వగచుచు దానును దనప్రాణకాంతయు చిరకాలంబు పార్వతీనాథు నారాధించుచుండ తదనుగ్రహంబున జిరకాలంబున నొక కన్యకారత్నంబును బడసె. ఆర్యంగన్నహిమవంతునికరణి సంతసిల్లి సంపూర్ణకాముండ నైతినని భక్తగణంబుల రావించి యక్కన్యకామణిజాతకర్మాదిక్రియల నిర్వర్తించి సీమంతినియను నామకరణంబు గావించె. అంత కొలదికాలంబుచన నొక్కనాడు మక్కువతో నక్కన్యకామణి జాతకము జూడందలంచి జోస్యులరావించి యడుగ వారాకన్యకజాతకచక్రంబు దిలకించి యీామె సర్వైశ్వర్యంబుల దులదూగుచు వరునితోగూడి పెక్కు సంవత్సరములు సామ్రాజ్యభోగంబు లనుభవించి యష్టపుత్రుల నొక్క కన్యకను గని స్థిరకీర్తిని బొందునని చెప్ప, రాజు సంతసించి వారల కనేక మణిమయభూషణాంబరంబుల నొసంగి పూజింపుచున్న సమయంబున నొక ధూర్తభూసురుండు లేచి "రాజా! యీాజోస్యుల

జోస్యం బబద్ధంబు. ఇక్కన్యకామణికి దైవగతిని చతుర్దశాబ్దంబున బతివియోగంబు సంభవించు; నది నిక్కం" బనుచు చెప్పి యెవ్వియోశ్లోకంబు లందుల కనుకూలంబుగ బఠించుచు బలుక రాజు భీతిల్లి మితిలేని దుఃఖసాగరంబున మునింగి మూర్ఛిల్లి కొంతవడికి దెలివినొంది యంతయు దైవాధీనంబని చిత్తమందు దలంచి వారలవీడ్కొలిపి నిజమందిరంబునకుం జనియె. అంత నిత్యము రాజు సీమంతిని నల్లారుముద్దుగా జూచుచు సాకు చుండె. అంత తన ముద్దుపట్టికి బంచవర్షప్రాయంబున నక్ష రాభ్యాస మొనరించి తన గురువగు యాజ్ఞవల్క్యునియొద్ద విద్య నభ్యసించుటకు నియమించె.

ఆబాలామణియు సమస్తవిద్యలను నవలీలగ జదివి విద్యానిపుణత్వంబును జూపుచు శుక్లపక్షపాకరునింబలె దిన దినాభివృద్ధి నొందుచుండె. ఇట్లుండ నొకనాడు పుడమిరే డంతఃపురంబున దన సతీలలామతో నుబుసుపోకకు ముచ్చట లాడుచు, " మన గారాబుబిడ్డయగు సీమంతినికి బదునాల్గవ వత్సరంబున వైధవ్యముగలుగు నని యొక విప్రోత్తముండు తెలిపెగదా యేమగునో" యని చెప్పుచుండగా నటనున్న యొక దాది విని యయ్యంబుజాక్షితోఁ జెప్పగా, నామె దిగులొంది చిత్తవికారముతో దన గురుపత్నియగు మైత్రేయికడకు జని యామెపాదంబుల కెరగి, తన వృత్తాంతంబును దెలిపి యనేకవిధంబుల నుతించి, "తల్లీ! నాకు సమస్తభోగంబులకు నిధానంబై మంగళప్రదంబై యైశ్వర్యదాయకంబై సుమంగ లీత్వమిచ్చునట్టి వ్రతరాజం బెద్దియేని యొం డాచరింపవలెనని యున్నది, భయాకులచిత్తనై యున్న నన్ను గరుణించి తెల్పు"

మని యడుగ, నామెయు నాచిన్నది భక్తివినయంబుల బలుకు పలుకులకు సంతసించి కనికరించి యిట్లనియె. "తల్లీ! నీకు నేనొక వ్రతవిధానంబు దెల్పెద; నది నీవు కడుదీక్షతో నిర్వర్తించిన గామితంబులన్నియు బొందగల"వని తెల్ప, నప్పువ్వుబోడి సంతసించి, యట్లొనరించెదనని నమస్కరించి తద్వ్రతవిధానం బానతీయుమని ప్రార్థింప గురుపత్ని వ్రతవిధానం బిట్లు చెప్పందొడంగె.

"ఓ కోమలాంగీ! సోమవారమునాడు స్నానము జేసి శుచివై ధౌతవస్త్రము ధరించి యుపవాసదీక్షంగొని ప్రదోష కాలంబునందు రత్నపీఠంబునం దుమామహేశ్వరుల నిలిపి షోడశోపచారపూజల బూజించి సద్భక్తులయినవారిని దంపతీ యుతంబుగా నర్చనజేసి వారల నిష్టమృష్టాన్నంబులచే దృప్తినొందించి రాజితరత్న భూషణాంబరంబు లొసంగి వారి చ్చు దీవెనలను బొందుచుండ వలయును. ఈవ్రత మెట్టి వంటి సంకటంబులు గలిగినను విడువక ప్రతిసోమవారంబున దప్పక చేయుచుండవలయును. అట్లాచరించుటవలన గల్గు ఫలంబుల దెలిపెద విను"మని చెప్పందొడంగె.

"ఈవ్రతంబువలన గలుగు ఫలం బింత యని వర్ణింప గమలజముఖ్య దేవతాబృందమైనను శక్తులుకాజాలరు. అట్టి యెడ నకించన నగు నాకు సాధ్యమగునా? అయినను గపర్ది కరుణావిశేషంబున నే బలుకు ఫలంబుల నేమరక యాకర్ణిం పుము. సీమంతినీ! పార్వతీపరమేశ్వరుల యభిషేకంబున నఘనాశంబును, పీఠపూజనంబున రాజ్యభోగంబును, గంధ మాల్యాక్షతార్పణంబుల వలన తులలేని సౌభాగ్య సౌఖ్య

బులును భూపదానంబున నిర్మలానందంబును, దీపప్రదానం బున కీర్తివిశేషంబును, నైవేద్యంబున సర్వైశ్వర్యంబులును, తాంబూలదానంబున కామితార్థప్రాప్తియు, నమస్కారంబు న పురుషార్థంబులును, మంత్రజపంబున సమస్త శుభములును, భక్తపుంగవుల భోజనంబున సర్వదేవతా సంతృప్తియు, పార్వతీపూజనలన దీర్ఘసుమంగలీత్వంబును, గలుగును. అం దువలన నీ వతినిష్ఠాగరిష్ఠవై యీ వ్రతం బాచరింపు"మన, నక్కంజాక్షి సంతసించి గురుపత్నిపాదాంబుజములకు ప్రణ మిల్లి నిజగృహంబున కేగి సోమవారవ్రతంబు భక్తినిష్ఠలతో జేయుచుండె.

అంత సీమంతినికి యుక్తవయస్సువచ్చుటయు, నృ పాలుండు వివాహముచేయదలంచి ధరాతలంబునంగల రాజ బృందంబునకు దెలియునటుల స్వయంవరంబు సాటింప, సౌం దర్యనిధియగు నక్కన్యకామణిని జేపట్ట నమితోత్సాహం బుతో భూతలమునంగల భూపకుమారులందరు వచ్చుటి కే తెంచిరి. అంత నాస్వయంవరసభయం దున్న క్షితిపకుమా రులకు మిన్నయై తారల నడుమవెలుగు తొగకన్నెచెలుని పగిది దనరారుచున్న నిషధేశ్వరుండగు నలమహారాజు పౌత్రుండైన చంద్రాంగదనృపాలుని సీమంతిని వరింప, చిత్ర వర్మ యధికవైభవంబుతో బాణిగ్రహణమహోత్సవంబు జరిపె. తదనంతరంబు చంద్రాంగద సీమంతిను లిద్దరు గాఢ మైన ప్రేమలతాపుంజంబులచే నొకరి నొకరు విడువజాలక కామిత సుఖంబు లనుభవించుచు రతీమన్మధులవలె నన్యో న్యానురాగంబున మితిలేనియానందమున మెలంగుచుండిరి.

ఇట్లుండ నొకనాడు చంద్రాంగదుం డధికోత్సాహం బుతో వనవిహారంబునకై భటాళిగూడి పయనమై పోవుచుండ మార్గమధ్యంబునగల యమునానదిని దాటుటకై యోడ నెక్కి చనునపుడు, విధినిర్ణయంబుచే నాయోడ నీటమునింగె. అంత గొందరు మడిసిరి. మరికొందరు తీరమునకు జేరిరి. చంద్రాంగదుండును మరికొందరు భటులును గనుపింపరైరి.

ఈవార్త చిత్రవర్మనృపాలుడు చారులవలన విని పట్ట రాని దుఃఖంబునఁ బొగులుచుఁ దీరంబుజేరి యమునా గర్భం బంతయు, శోధించినను జామాతృనిజాడ గనుపింపనందున నిరాశచే నింటికివచ్చి నిషధపతియగు నింద్రసేననృపాలుని కీ విచారవార్తఁదెలుప చారులఁబంపగా, నారాజు విని దుర్భర పుత్రవియోగభరంబున చింతాక్రాంతుండై విధినిదూరుచు నాహారంబులమాని మిక్కిలికృశించి యెట్లో జీవములతో మెలంగుచుండె.

అంత నిక్కడ చిత్రవర్మక్షితిపాలు డత్యంత దుఃఖాగ్ని చే హృదయంబుకాగుచున్నను నెట్లో చిత్తంబును పదిల పరచికొని జామాతకు ప్రేతసంస్కారవిధుల నిర్వర్తించె. మరియు దన కుమార్తెకు పొరలి పొరలి వచ్చు దుఃఖాబ్ధివీచి కలకు జెలియలి కట్టయా యనదగు తనశాంతవాక్పరంపరచే నామెను నోదార్చుచుండుటయేకాక, తమవచోనైపుణ్యంబున దనకూతునికి దుఃఖోపశాంతి కలుగజేయ సమర్థలగు చెలుల నామెకడనుండ నియమించె.

అంత సీమంతినియు గురుపత్నియాజ్ఞలను శిరసా హించి వినయవిధేయతలు ముప్పిరిఁ గొనిన భక్తితో సోమ

వారవ్రతంబు జేయుచు, సోమశకలార్ధమౌళిధ్యాన తత్పరమై యుండె. ఇవ్విధంబున జంద్రాంగదుని దారయు, మామయు మాతాపితలును వర్షత్రయంబు గడిపిరి.

అట యమునలో మునింగిన చంద్రాంగదుండు దైవ యోగంబున బోయిపోయి రసాతలంబునం దపరిమితోత్సాహముతో జలక్రీడలాడుచున్న నాగకన్యలుండుచోటికి జేరిన నాగజగమన లానృపకుమారుని తమ ప్రభువగు తక్షకుపేరోలగంబునకు గొంపోయి నాగరాజున కప్పగించిరి. అంత చంద్రాంగదుండు భాసురరత్నమణిమయసింహాసనంబునం దధివసించి యున్న తక్షకుని గని భానుకోటిప్రభను ధిక్కరింపజాలు వాని మోమును జూడజాలక నిమీలితలోచనుడై, నమస్కరించి ప్రక్కను నిలిచినంత, నా తక్షకరాజు వానింజూచి "ఓయీ! నీవెవ్వండవు? నీనామం బెయ్యది? నీనివాసం బెయ్యది? నీయిష్టదైనం బెవ్వఁడు? ఇటకు వచ్చుటకు నిమిత్తం బెయ్యది? నిర్భయముగాఁ జెప్పు"మని యడుగ, నారాకుమారుండు భయదుఃఖ వినయంబులు ముప్పిరిగొనిన చిత్తంబును జక్కజేసికొని "ఓమహానుభావా! నేను నిషధపతియగు నింద్రసేననృపాలుని పుత్రుండ. చంద్రాంగదుం డను నామంబు గలవాడ. నృపాల శేఖరుండగు చిత్రవర్మని గారాబుపట్టియగు సీమంతినిం బెండ్లియాడి సుఖంబుగ గాలము గడుపుచు, నేడు వనవిహారంబునకై బయలుదేరి మార్గమధ్యంబునం గల యమునానదిని దాటుచుండ, నావ నీట మునింగె. నే నానదీజలంబుల బడి మునింగి యీనాగకన్యకలున్న తావున కెట్లో చేరితి. అంత

వీ రిచ్చటికి గొని తెచ్చిరి. దేవా! మేము నిర్వికారుండును నిరంజనుండును భక్తజనవత్సలుండును దీనపోషకుండును సమస్తదేవతాసేవితుండును త్రిమూర్తిస్వరూపుండును గిరిజామనోహరుండును గంగాధరుండును నీలగళుండును చంద్రార్కానలాక్షుండును 'పరబ్రహ్మస్వరూపుడును నగు శంకరు నారాధించువార" మనియె.

ఆనృపాలకుమారుని మృదుమధురయుతంబులును భక్తిపురస్సరంబులును నగు వాక్కులను తక్షకుండు విని మది సంతసించి యుప్పొంగి "ఓ రాకుమారా! దీనరక్షకుండగు భర్గునిభక్తుల నాదరించుటచే వచ్చు ఫలం బధికంబు. కావున నిష్టోపభోగంబు లనుభవించుచు మాసదనంబున నీవు సుఖివై యుండు" మన, చంద్రాంగదుం డిట్లనియె. "ఓ సర్పరాజా! నేను నాజననీజనకుల కేక పుత్రుండ. నేను గతించితి నను వార్త విని వారెంతగా విలపించుచుండిరో! నాదేలోకముగ జరించు నాసహధర్మచారిణి నా యర్ధాంగి నాకై యెంతగ గుందుచుండెనో? నాయత్తమామ లెంతగ నార్తిని బొందుచుండిరో? మరియు నో ధర్మస్వరూపా! నాయెడబాటుకతన నిల్లాలార్తిచే శుష్కించుచుండ మాతాపితలు దుఃఖించుచుండ బంధుమిత్రాదులు విగతసంతోషులై యుండ, సౌఖ్యాలాలసుండనై నే నిట నుంట ధర్మమా? భక్తరక్షకుండగు నుమాపతి మెచ్చునా? కాన నే నిచ్చట నుండుట న్యాయంబె? సర్వజ్ఞులగు మీరు నాహృదయవిజ్ఞానవిమర్శనార్థ మట్లంటిరిగాని హైమవతీపతిశిరోభూషణుడ

వై సకలశాస్త్రకోవిదుండ వగు నీవంటి ధర్మమూర్తికి దెలి యని నీతి కలదే?" యని వినయమున బలుక, "తక్షకుం డతని వాక్కౌశలంబున కచ్చెరువొంది, "ఓ నృపకుమారా! నిన్ను జూచినంతనే నిర్మలచిత్తంబుతో శశికళాధరుని గొనియాడుచు వచ్చిన ధర్మశాస్త్రపుంజమే యీనీ స్వరూపంబుగా వచ్చె నాయని నాకు తోచుచున్నది. కొలదికాల మిట నుండుము. అదియునుంగాక నీ కులకాంతయగు సీమంతిని యొక్కవ్రొని దీక్షతో జేయుచుండిన సోమవారవ్రతవిశేషంబునకు శైల జాహృత్కుశేశయార్కుం డెద మెచ్చి, మృత్యుంజయుండగు నప్పరమేశ్వరుడు నిను మృత్యువునుండి తప్పింపదలంచి యాతని భక్తుండనగు నానిలయంబునకు నిన్నుజేర్చె. నీవిందు కొలదికాలముండవలయు. తప్పదు. నే నిది యంతయు దివ్య దృష్టిచే నెరుంగగంటి." నని యాదరించి కొంతకాలము నిలిపి కొని, వాని విధేయతకు సంతసించి, పంప నెంచి, "నీవు మాకన్ని విధముల బూజనీయుండవు. నీమది సంతసించిన నీలకంఠుడు మెచ్చును. కనుక కొన్ని వరము లిచ్చెద వేడు" మన, నా క్షితిపకుమారుండు సంతసించి, "ఓ ధర్మమూర్తీ! పరమ తపో ధనులకైనను జొర నశక్యం బగు రసాతలంబున కధిపతులై విఖ్యాతి గాంచిన మీవంటి పరమపావనులదయ జ్ఞానలవ ములేని నావంటివానిపై గల్గినం జాలదే? వేరుగ నేమి కావ లయు?" నన, నాగపతి మితిలేని యానందంబు నంది, దారను తలిదండ్రులను జూచుకోరిక వానికి మిక్కుట మయ్యెనని గ్రహించి, వాని కోరిక దీర్పనెంచి, యతని సుగంధ ద్రవ్య ములచే బూజించి, దివ్యమణిభూషణములు గట్ట నిచ్చి,

కామగమనయగు నొకయశ్వమును చంద్రహాసం బను బెడిదంపు టడిదంబును నిచ్చి, సహాయార్థము మిక్కిలి బలసంపన్నుండగు నొక రక్కసు నిచ్చి, తనకుమారరత్నం బగు యశ్వసేనుని రావించి, వీరిని మర్త్యలోకంబున దింపిరమ్మని యాజ్ఞనిడి, "రాకుమారా! నీ కవసరమగుపట్ల నన్ను దలంచుము. నే వచ్చి నీ యాపదలను బాపెద"నని తెలుప, నానృపాలకుమారుం డధికోత్సాహంబు గదుర, నురగపతికి సాష్టాంగదండప్రణామంబు లాచరించి, సెలవు గైకొని, యశ్వసేనుడు గొని తెచ్చిన యశ్వంబు నధిరోహించి, యశ్వసేనుండును రక్కసుండును నిరుప్రక్కల రా, బయనమై కొలది కాలంబునకు యమునానదీతీరంబునకు జేరి, విలాసార్థముగా నందు దిరుగుచుండె.

ఆనాడు సోమవారమగుట సీమంతిని పార్వతీప్రాణనాథున కభిషేకజలంబుల గొని పోవుటకై పసిండికుండికం గొని చెలికత్తెలతో జనుదెంచిన, నానృపకుమారుండు దూరమున జూచి, యిట్లని వితర్కించె. "శుష్కశరీరయు, మలినరహితయు నిందుమౌళిసద్భక్తితత్పరయు, పతివ్రతామణియు నైయుండియు, సూర్యునిగానక పరితపించు నీరజంబు పగిది కళావిహీనయై యున్న యీలతాంగి యెవ్వతె? విగతభర్తృకవేషంబున గన్పట్టియు నామనంబు నాకర్షింపుచున్నది. ఇది యేమి యాశ్చర్య" మని కొంతవరకు తదేకదృష్టిం జూచి, మది పంకించి, యెట్టకేలకు, "నాసతియే కావచ్చును. నేను మృతినొందితినని, యీతీరుననున్నది కాబోలు" నని నిశ్చయించి, వెంటనే

ప్రేమలత యిగురెత్త, నిలునజాలక, యాలతాంగి యున్న దెసకు బిరబిరం జనుచుండె.

"ఆబింబాననయు నావచ్చు నృపాలకుమారు నోర చూపులం జూచి, యీ పురుషుండు జితమన్మథుడై రత్నమణి మయభూషణంబు లింపొందగా ధరించి, కమలాక్షుల హృద యాబ్జంబుల నాకర్షించు శీతకరుండుగ నున్నవాడు. పతి వ్రతనగు నామనంబును గూడ నాకర్షింప దలపడియున్న వాడు. నావ్రతదీక్షామాహాత్మ్యంబున నామనోహరుండె యీ తీరునవచ్చుచుండెనా" యని యాసీమంతిని మనంబునం దాకు లత జెందుచుండె. అంతంత దవ్వులకు రా నారాకుమారుం జూచి తలవంచి నిలిచియున్న యాయంగనను సమీపించి సుధా కరు కిరణంబుల మించు చల్లని మృదుమధుర భాషణంబుల నిట్లనియె. "ఓ వనజాక్షి! నీ వేక్షితిపాలునకు ముద్దుపట్టివి? నీ చిత్తచోరుం డెవడు? నీ కిట్టిదుర్గతి యెట్లుసంభవించె? నీ చిత్తం బునం గల్గువిచారంబంతయుందప్పక నాతో వక్కాణింపుము. నీకు శుభంబగు"నన నాగజగమన యాసుందరాకారుకంఠధ్వని విన్నంత నెన్నడో గతించిన నిజనాథుని కంఠధ్వని చెవిసోకి నట్లుండ దుఃఖంబు నాపజాలక మూర్ఛిల్లె. అంత నానృపాల కుమారుం డయ్యంబుజాక్షికరంబు కరంబునం బట్టి లేవనెత్తి దయారసంబాల్కెడి వాక్కులతో "ఓసుందరాంగీ! నీ చిత్తం బునం గల్గుచింతాతమఃపటలికి నన్ను చంద్రునిగాదలంచుము. ఇక్కట్టుల దాచకవక్కాణింపవే" యనియడుగ, నా మోహ నాంగియు కరస్పర్శంబు దుఃఖోపశమనంబిడిమెనా యనితోప

చిత్తంబును జక్క జేసికొని, "దీనరక్షా! నృపాలరత్నంబగు నిందసేనుని తనయుండగు చంద్రాంగద నృపాలుని యర్ధాంగినై మదీయజనకుండగు చిత్రవర్మని యింట సుఖంబుగా నుండుదాన. కొలదికాలముక్రిందట మన్నాథుండు వనవిహారంబునకై చని యమున దాటుచుండ నోడ మునింగి జలంబులం బడి మృతుండయ్యె. అంతకొలదికాలంబునకు నత్తమామలు దాయాదులకోడి బందీకృతులైరి. ఇన్నియిడుమల గుడిచినను నెదను ధైర్యంబు వీడక భక్తితత్పరనై, యాపద్బాంధవులగు గౌరీశంకరుల బూజించిన నాయాపదల గడవగలనని నిశ్చయించి, సోమవారవ్రతరాజంబును విడువక చేయుచుంటి. నేడు వ్రతదినంబుకావున సోమకళాధరున కభిషేకజలంబుల గొనిపోవుటకై వచ్చి, నిరుపేద పెన్నిధిగన్నచందంబున మిమ్ముజూచి, యిందుకళాధరు డీమందభాగ్యను గాపాడుమని పంపిన మహనీయమూర్తి యని మిమ్ముల భావించుచున్నదాన. కాన దీనురాలనగునన్ను రక్షింపవే" యని ప్రార్థింప, నాసుకుమారు డాకోమలాంగి మృదుహస్తంబును హస్తంబునం బట్టి, "శోభాసురాంగి! నీ వ్రతమహిమంబువలన నీనాధుండు మృత్యువును కాలదన్ని, మృత్యుంజయుని ధ్యానించుచు, యక్షుండనగు నాతోకలిసి తిరుగుచున్నవాడు. దినత్రయంబునకు నిన్నుంజేరి నీకు కామితసుఖంబు లొసంగగలండు. కాన నీ వెంతమాత్రము చింతింప వల"దని చెప్ప, నామెయు నానందమ్ముప్పొంగ, నాజితమన్మధుని తన పతియని యనుమానించియు. దుఃఖావేశంబున నిర్ణయింపజాలక యాతని పాదపద్మంబులకు నమస్కరించి, నీలకంఠుని ధ్యానించుచు తన భవనంబున కేగె.

అంత చంద్రాంగదుండు తనకులాంగన పతివియోగం బుచే గృశించుట జూచియు మాతాపితలు బందీకృతులైరని వినుటచే గలిగిన దుఃఖంబును భరింపఁజాలక, తొల్తొల్త వారిని బంధవిముక్తుల జేసి కష్టంబుల వాపుటయ ప్రథమ కర్తవ్యంబని నిశ్చయించి, యశ్వసేనుని రక్కసుని వెంట నిడుకొని నిషధకు బయనమై పురోపవనంబునకు జేరె.

అంత నానృపకుమారుం డశ్వసేనుని జూచి, "తక్షక తనయా! నీ విప్పుడు మాశత్రువులగు దాయాదులకడ కేగి నా తల్లిదండ్రుల వెంటనే బంధవిముక్తుల జేయుటకును మా రాజ్యంబు మాకిచ్చుటకును నీ శక్తికొలది చెప్పి సమ్మతింప జేయుము. అందులకు వా రంగీకరింప రేని యుద్ధంబునకు సిద్ధంబుగా నుండుడని చెప్పిర"మ్మనగా, నశ్వసేనుండు వానికి వందనం బిడి యతిత్వరితగతి నాదాయాదులయొద్ద కేగి, చంద్రాంగదునివృత్తాంతం బంతయు జెప్ప, వారు భయాకులచిత్తులై చంద్రాంగదునితల్లిదండ్రులను బంధవిముక్తుల జేసి, వారిని వెంట నిడుకొని చతురంగ బలంబులు గొలువ సీమంతినీ మనోవల్లభుని జేరి, నమస్కరించి, "తమ తప్పుల మన్నింపుమని ప్రార్థించిన, శరణాగతత్రాణుండగు నారాకుమరుండు వారిని మన్నించి, మీపట్టణంబుల. కేగి సుఖంబుగా నుండు" డన, వారును వానికి నమస్కరించి బ్రతుకు జీవుడా యని భయ ముడిగి తమతమ నివాసంబుల కేగిరి. అంత చంద్రాంగదుండు మాతాపితలం గని నమస్కరింప, వారును "మాపాలి పెన్నిధీ! వచ్చితివా" యని కౌగిలించి మూర్ధంబున ముద్దు లిడి

సంతోషజలధిలో మునింగి తన్మయులై యున్న సమయంబున, సామంతులును నమాత్యులును సుహృద్బాంధవులును, పుర జనంబులును జేరి వందనంబు లిడి, వారిని పట్టపుటేనుగుపై నెక్కించుకొని, తమ పట్టణంబున నూరేగించుచు, భేరీ మృదంగాది వాద్య విశేషంబులతో నానందంబున రాజ భవనంబునకు జేర్చిరి.

అంత చంద్రాంగద తేజఃపుజంబును జూడ జాలకో యనునట్లు సూర్యుం డపరాద్రి దిక్కై యేగుచుండె. అంత లేబచ్చికల మేసి గుంపులు గుంపులై విలాసంబుగా దుముకుచు వేడుకతో బొడుచుకొనుచు తమతమ లేగలం గూర్చి యంబా యను రవంబుల బిలుచుకొనుచు, మన భూపాలుండు సేమంబుగ వచ్చియున్నాడని తెల్పుచుండెనా యను గోవత్సముల ప్రతిరవంబుల వినుచు గృహంబులకు జేరు గోబృందంబులును, బయల తిరుగుట మాని పట్టణపరిసరవృక్షంబుల పైగల తమ గూండ్లకు చేరి తమతమ కృత్యంబుల నొండొరులకు దెల్పుకొనుచు, తమ రాజు పునర్జీవియై సుఖంబుగ వచ్చియున్నాడను శుభవార్త నెరింగి, తమకు కలిగిన సంతోషము వెల్లడించు చున్నవాయన కలకలధ్వని జేయు శకుంతసంతానంబులును గలిగి హృదయాహ్లాదంబుగ నాపట్టణ మొప్పారె.

రాత్రి గడిచె. యౌవనదంపతులు దిగులొంద కలువలు భీతిల్ల కమలంబులు వికసింప పక్షులగానంబులు దిక్కులు నిండ కులాంగనలు గృహకృత్యంబులు నిర్వర్తించుచుండ గాఢాంధ

కారంబు పటాపంచలైపోవ భూలలామతాల్చు పెద్దకుంకుమ బొట్టో యనున ట్లినుండు తూర్పుకొండపై నుదయించె. రాజ గృహాంగణమందలి మంగళవాద్యంబులు విని యింద్రసేన నృపాలుండు మేల్కని కాల్యకృత్యంబులు దీర్చుకొని రాజ సభ కేతెంచి, చారులతో తన కుమారుని వృత్తాంతం బంత యుం జెప్పి మీరీసంగతి నంతయు చిత్రవర్మనృపాలునికి దెలుపుడని పంపె.

అంత చారులు చిత్రవర్మనృపాలునికడ కేగి యా వృత్తాంతంబంతయు నివేదింప నతండు మది నంతసించి, తన కుమార్తెను కనకరత్నభూషణంబులచే నలంకరింపజేసి పీతాంబరములను ధరింప నిచ్చి, ముత్తైదువులకు తులలేని కానుక లొసంగి, సంతోషసూచకంబుగ సీమంతినికిని పున ర్జీవియై వచ్చిన తన యల్లునకును పునర్వివాహము సేయ గుతూహల మయ్యె నని చెప్పి, యావార్త దెలుపుచు నింద్ర సేననృపాలునకు శుభలేఖ వ్రాసిపంప, వారును బంధు మిత్రాది వర్గంబు గొల్వ, భేరీమృదంగాది వాద్యరవంబులతో రా చిత్రవర్మనృపాలుడును తగిన విడిదెల నిలిపి, మితిలేని మర్యాదలతో సాటిలేని వైభవమున వివాహం బొనర్చె.

అంత నింద్రసేననృపాలు డందరిని వెంట నిడుకొని తన పట్టణంబు జేరి, తన పుత్రునకు పట్టాభిషేకము జేసి, తాను భార్యా సహితముగా వనంబున కేగి కొంత కాలంబు తపస్సు జేసి సతీయుక్తంబుగ రజతగిరిం జేరె.

అంత జంద్రాంగదుండు రాజ్యంబు ధర్మంబుగ బాలించుచుండ సీమంతిని సోమవారవ్రతంబు జేయుచు సుఖంబుండె" నని సూతుండు చెప్పిన, శౌనకాది మహామునులు వానింగాంచి "ఓ పౌరాణిక శిఖామణీ! నీ కరుణా కటాక్షం బున పాపనాశంబును, నైశ్వర్యప్రదంబును, ముక్తిదాయ కంబును నగు సోమవారవ్రతమహిమావిశేషంబు విని ధన్యుల మైతిమి. మీవాక్యసుధారసంబు వర్ణింప శక్తిమంతులము గాము. పతివ్రతామణి యగు నాసీమంతినీ ప్రతిభావిశేషంబు లెట్టివైన గలవేని దెలుపుమన నా పౌరాణికశిఖామణి వారలం జూచి, మునీంద్రులారా! ఆమహాసాధ్వి తద్వ్రతాచరణంబున బడసిన శక్తివిశేషంబు దెలుపగల యొకకథ కలదు. దాని వివరింతు వినుం డని చెప్పం దొడంగె.

"విదర్భ ప్రాంతంబున వేదాధ్యయన తత్పరులును ధర్మ శాస్త్రవేత్తలును తర్కశాస్త్రవిదులును నగు ద్విజోత్తములతో దనరారుచున్న భూరమణీహారం బన నొప్పు నొక్కయ గ్రహారంబు గలదు. అందు నివసించుచున్న మిత్రుం డను నొక భూసురోత్తమునకు సుమేధుం డను పుత్రరత్నంబును, సారస్వతుం డను వారునకు సోమవంతుం డను సుతుండును గలరు. వారిరువురు నన్యోన్య మైత్రితో మెలంగుచు, ఛందో వ్యాకరణాది షట్ఛాస్త్రంబుల జదివి, ఋగ్యజుస్సామాథర్వ ణంబులు పఠించి విద్వాంసులందు మిన్నలై వేదపారాయణు లకు గురువులై యావనులై కృష్ణార్జునుల వలె బావమఱదుల వరుసతో ప్రకాశవంతులై యుండిరి.

ఇట్లుండ నొక్కనాడు వారి జనకులు, తమ పుత్రులు వివాహయోగ్యులై యుండి రని భావించి వారిం జేరి, "తనయులారా! మీరు విద్యాపారంగతులై మెలంగుచుంటిరి. మీ వివాహప్రయత్నంబుల జేయుటకు మాచెంత విత్తం బేమియు లేదు. విద్యావంతులైనవార లింట గూర్చుని సూపాన్నములు మెక్కుచు, సుఖోపభోగులై యుండిరేని, వారి కీర్తి కృష్ణపక్ష క్షపాకరుని వలె క్షీణించుచుండును. కనుక పండితులైనవారలు దేశదేశములు గ్రుమ్మరి, భూపతులసభల కేగుచు, నందు విద్యాపటుత్వములు వెల్లడించుచుండి రేని, వారియశస్సు శుక్లపక్ష చంద్రుని వలె వృద్ధియగు చుండును. కనుక మీరలు క్షితిపతుల పేరోలగముల జేరి, మీ విద్యానిపుణత్వమును జూపి విత్తం బార్జించి పాణిగ్రహణములు జేసికొని, ధర్మార్థకామముల నార్జించి మమ్ముల నంతసింప జేయు డని యడుగ వారును సంతసించి మాతాపితలకు వందనము లిడి, బయలు దేరి విదర్భకు జేరిరి.

అంత నా నృపాలుని పేరోలగంబు జేరి రాజుంగని దీవించినంత నధ్ధరాపతి వారికి వందనము లిడి గౌరవించి, కూర్చుండ నియమించి, వచ్చిన కార్యం బెద్దియో తెలుపుడన, నావిప్రబాలకులు తమ విద్యానిపుణత్వము రాజున కెరుకపరచి, తమ నామధేయములు దెలిపి, వివాహనిమిత్తమై వచ్చితి మన, రాజు వారిని సాదరముగ గౌరవించి "మీ యాప్సితార్థములు నెరవేర్చెదను. కాని మీరలు నే జెప్పిన విధముగా బ్రవర్తించవలెను. భూలోకమున పతివ్రతలకు

మిన్నమై జగద్విఖ్యాతి గాంచిన సీమంతిని నిత్యసోమవార వ్రతము సలుపుచు దంపతులకు వాంఛితములైన ధన కనక వస్తువాహనము లిచ్చి పూజించుచుండును. కాన మీ యిరువురియం దొకరు వనితవేషము ధరించి దంపతుల మని చెప్పి యామె యిచ్చు విత్తమును గొని రావలసినది” యన విప్ర బాలకులు రాజుమాటలకు వింతపడి యిట్లనిరి.

“ఓరాజా! విద్యాపారంగతుల మగు మమ్ము నిక్కార్యము జేయు మనుట మీ కుచితంబే? కపటదంపతులమై యప్పరమపతివ్రతామణిని మోసగించుట ధర్మంబే? రాజాంతఃపురమున కృత్రిమవేషధారులమై పూజ లొందిన రాజద్రోహులము కామె? కనుక నిక్కార్యం బెట్లు చేయుదు” మన, నృపాలపుంగవుండు నక్కటికం బుప్పతిల్లునట్లు మృదు మధురభాషణముల నిట్లనియె.

బాలకులారా! మీ కెంత మాత్రము భయము వలదు. మిమ్ముల సుఖవంతుల జేసెద, నదియుం గాక ప్రపంచమున మాతాపిత గురునృపుల యాజ్ఞలను మీరరాదని ధర్మ శాస్త్రములు వక్కాణించు చున్నవి. కనుక నా మాటను మీరుట యధర్మము. కొంకక యట్లొనర్పుడు. మీకు శుభము గలుగునని యన నృపాలుని కెదురు సెప్ప జాలక, సోమవంతుండు వనితవేషము ధరించి కపటభూసురదంపతులై నిష ధకు జేరిరి.

నాడు సోమవారం బగుటవలన సీమంతినియు నుషః కాలంబున లేచి కాల్యకృత్యంబుల నెరవేర్చి వ్రతదీక్షంగొని

యుమామహేశ్వరుల బూజించి, దంపతిపూజ సేయు సమయం బున కచ్చోటికి కపటభూసురదంపతు లేతెంచిరి. అక్కమలాక్షియు బుధనరుల మధ్య మెరపు తీగెవలె మెరయుచు నొక్కొక్కరి చెంతకు హంసనడకలతో సేగుచు, నన్న పూర్ణవలె భోజనపదార్థము లిడుచు, వాణివలె మాట్లాడుచు లక్ష్మివలె ధనము లిచ్చుచు, గౌరివలె నరము లిచ్చుచు ముఖముపై తిలకము నీటుమించ, వికసించిన కమలముల ధిక్కరించిన నేత్రయుగ్మమున కరుణాకటాక్షములు వెదజల్ల సింహమధ్యము గదల గజలక్ష్మివలె దిరుగుచు దంపతులను భోజన మజ్జనాదులచే దృప్తి బొందించు చుండె.

అట్లు తృప్తి పరచుచు నా కపటదంపతుల యొద్ద కేతెంచి, వారి కృత్రిమమును నామె గ్రహించియు, వ్రతము విఘ్నమగు నని యెంచి, చిత్తమున పార్వతీపరమేశ్వరులను దలంచి.వారిని పూజించి యక్షతలు జల్లి దంపతులగుదురు గాక యని చిత్తమున దలంచి కానుక లొసంగె.

వారును నామె యిచ్చిన యాతిథ్యమును గైకొని యా రాత్రి యచ్చోటనే యొక ప్రదేశమున బరుండి తమ గుట్టు బయలు పడునని యెంచి యర్ధరాత్రమున బయనంబై మాతులుంగ లవంగ కేతకీ భల్లాతకీ ఘనపాదపముల శాఖ లన్నియు భల్లూకవ్యాఘ్రాది మృగరాజములకు నీడ లొసంగు దివ్యభవనముల వలెను, భూజములశాఖ లొండొంటిం బాణి గ్రహణములు జేయుచున్నవా యన్నట్లు గలిసి, శుకపిక

బక కోకిలాది శకుంతసంతానములకు నివాసములై, పరోప కారమును లోకమునకు జూపుటకో యన్నట్లు ప్రాణికోటికి జీవనంబై తనరు మధురఫలములు వ్రేలాడుచుండ చూత నారికేళకపిత్థాది ఫలవృక్ష సమృద్ధంబై, పాంథుల శ్రమం బపనయించి వారల కానందం బొసంగు నొక వనమునంబడి పోవుచుండ, పతివ్రతామణి యగు సీమంతినీ మహిమవలన స్త్రీవేషము స్థిరంబై రతీదేవిం ధిక్కరించు నొక సుందర కుందరదనయై రతియం దిచ్ఛగలిగి సుమేధుం జేరి యిట్లనియె.

ఈవనం బతిశృంగారంబై యుండె. కోయిలగానములు కర్ణరసాయనము లయ్యె. మన్మథుడు మితి మీరి సుమబాణము లేయుచుండె. చిత్తము తత్తరపడుచుండె. ఇంక నొక్క గడి య యైనను తాళజాల. నన్నుం గవయ రమ్ము. అధరం బాన నిమ్ము. మూర్థము ముద్దుబెట్టనిమ్ము. నీ కౌగింటం జేర్చి కృతా ర్థత నొందనిమ్ము. దయ జూడు మని యనుచు, మార్గమున కడ్డము వచ్చుచు, కరము కరమునం బట్టుచు వక్షోజము లంట జేయు చున్న దిలకించి, యతండు నిజం బరయ లేక బావమఱది గాన సరసం బాడుచుండె నని భావించి, కినుక బూని మన గృహంబులకు త్వరితగతి జనవలె. సరసం బాడ నిది యదనా యని నిష్ఠురోక్తుల గోపించిన, నాసుందరి సుకు మారా! నేను సీమంతినీ మహిమావిశేషంబున నిజంబైన కాంతనుగా నైతి నని నిజాంగంబుల జూపి, నాకామబాధ మాన్పవే యని కోరిన నా భూసురకుమారుండు మది చిం తించి కర్మఫలితంబని యెంచి ధైర్యం బవలంబించి యక్కాం

తను చక్కని మాటలతో నోదార్చి మన గృహంబుల కేగిన తరి విచారింత మని చెప్పి దీనాననులై కొంత కాలంబునకు నిజగృహంబులకు జేరిరి.

అంత తమ జననీ జనకులకు సర్వవృత్తాంతంబును జెప్ప వారును చింత నొందిరి. కాని సోమవంతుని జనకుం డధికదుఃఖంబును బొంది నరపాలునిపై నుగ్రుడై విదర్భకు బయనంబై రాజుచెంత కేగి కినుకతో "రాజా! నాపుత్రుండు విద్యావంతుడై యుండ మీరిట్లు చెప్పి మోసగింప న్యాయంబే? అదియుంగాక నాకేకపుత్రుండై యున్నవాడు. 'అపుత్రస్యగతిర్నాస్తి' యని ధర్మ సూత్రంబులు దెలుపు చున్నవి. నాకేది గతి యన, రాజు భీతిల్లి జరిగిన విధానం బడుగ విప్రుండు వృత్తాంతంబంతయు దెలుప, రాజు కొంతవరకు తాను చేసిన కృత్యంబునకు చింతించి, విప్రుని వినయవిధేయతల నాదరించి నిజనిలయంబున నిలిపికొని పట్టణసమీప వనంబందున్న భారద్వాజుండను మునీశ్వరుని రప్పించి, వానిచే శైవ మంత్రోపదేశంబు బొంది, విప్రునిసహితంబుగా కాళికాలయంబున కేగి మంత్రంబు జపించుచు నిష్ఠతో దినత్రయంబు జపంబు సేయ, నాకాత్యాయని మది సంతసించి భానుకోటి ప్రభను ధిక్కరించు కనకరత్నమణిమయభూషణంబులతోడను కరుణాకటాక్ష వీక్షణంబులు గల నయనపద్మంబులతోడను ముక్తి మూలంబగు పాదసరసీజంబులతోడను బ్రహ్మాండ నిలయంబగు కుక్షితోడను పట్టుపీతాంబరములు ధరించి ప్రత్యక్షంబైన, నృపాలుడు స్తుతింప, దేవి సంతసించి వాంఛితంబు

గోరుమన, నృపాలుండు "దేవీ! సారస్వతుని సుతుండు సతిగా మారె. వానికి నిజరూపంబు ప్రసాదింపు మన, దేవియు ఆవరంబు తప్ప మరొక్క వరంబు గోరు మన నద్ధరాపతి, తల్లీ! ఇది యిచ్చుటకు నీకేమి భారంబు. నేను లోకనింద భరి యింప జాల. కనికరించి ప్రసాదింపవే యన నాకాళి "రాజా! సీమంతిని చేయు సోమవారవ్రతమునందు దంపతి పూజ జేయుతరి వారల దంపతు లగునట్లు నిర్ణయించె. ఆవిధానంబు మార్ప త్రిమూర్తులకైనను శక్యంబుగాదు. సోమవంత సుమేధులకు వివాహంబు జేయుడు. సారస్వతునకు లోపంబు దీర వంశోద్ధారకుండగు పుత్రరత్నం బుదయించున ట్లనుగ్రహించితినని చెప్పి దేవి యంతర్ధానం బయ్యె. అంత నారాజు తద్వరవిధానంబును భూసురునకు దెలుప నా భూసురుండు గతంబునకు విచారింపక సంతసించి నిజగృహం బున కేగి, దేవీయాజ్ఞ ప్రకారంబు వారిర్వురకు వివాహంబు జేయ నాదంపతులు గాఢానురాగంబున సంసారసుఖంబు లనుభవించుచుండిరి. సారస్వతునకు కొంతకాలంబునకు నొక పుత్రరత్నం బుదయించె. అంత వారంద రపరిమితానందం బులం బొందిరి.

అని సూతుండు సెప్పిన శౌనకాది మహామునులు వానిం గాంచి మునివరా! మీవాక్సుధారసంబులును సీమం తినీమహాత్యంబును, శాంభవీభక్తరక్షణయును విని ధన్యుల మైతి మని చెప్పి యానందం బనుభవించుచు సోమకళాధరుని ధ్యానించుచు సెలవు గైకొని, తమతమ నిలయంబులకుం జనిరి.

———

ఓమ్

శ్రీ పార్వతీ పరమేశ్వరాయ నమః.

# శివ పూజా విధానము.

## గురుస్తోత్రము

శ్లో॥ గురు ర్బ్రహ్మా గురు ర్విష్ణు । గురుర్దేవో మహేశ్వరః
గురు స్సాక్షా త్పరబ్రహ్మా । తస్మై శ్రీగురవే నమః॥

## విభూతి మంత్రం.

భూతిర్భూతికరీ పవిత్రజననీ । పాపౌఘ విధ్వంసినీ। సర్వోపద్రవనాశనీ శుభకరీ । సర్వార్థసంపత్కరీ। భూతప్రేత పిశాచ రాక్షస గణారిష్టాదిసంహారిణీ । తేజో రాజ్యవిశేష మోక్షణకరీ। భూతిస్సదాధార్యతాం॥ ఏతానితాని శివమంత్ర పవిత్రితాని భస్మాని కామదహనాంగ విభూషితాని। త్రిపుండ్రితాని భసితాని లలాటపట్టె । లుంపంతి దైవలిఖితాని దురక్షరాణి ॥ శ్రీకరంచ పవిత్రంచ రోగదోషనివారకం । లోకస్యచకరంపుణ్యాం । భస్మంత్రైలోక్యపావనం ॥ ఆపాదమస్తకంచైవ రోమరోమాద్భవిష్యతి । విభూతీఅణుమాత్రేణ గంగాస్నానేన లక్షయోః । మాఘస్నానశతంగత్వా బ్రాహ్మణేభ్యో మహాయశః॥ (అని స్తవముచేయవలెను)

శ్లో. లలాటంతుమహాదేవం । నాభిచైవమహేశ్వరం । హృదయంశంకరంజ్ఞేయం। కంఠేచవృషభధ్వజం । భుజాగ్రేశూలపాణించ।మధ్యే కామాంగనాశనం।కరాగ్రే దేవదేవేశం

శ్రీకంఠం వామసద్భుజం । తన్మధ్యే ఈశ్వరం ప్రోక్తం। తదాగ్రే పార్వతీ ప్రియం । కర్ణేద్వే శివరుద్రంచ । కణ్ఠే చైవ మహేశ్వరం । బహిఃకంఠే పశుపతి । శ్శిర శ్శితో సదాశివం॥

స్మరే దేతానినామాని త్రిపుండ్రంధారయేత్ సదా॥

ఆ చ మ న ము.

మహేశ్వరాయనమః । మహాదేవాయనమః । సర్వేశ్వరాయనమః

స ం క ల్ప ము.

శివశివశంభోరాజ్ఞేయ ప్రవర్తమానస్య । ఆద్యబ్రహ్మణః । ద్వితీయపరార్ధే శ్వేతవరాహకల్పే । వైవస్వతమన్వంతరే। కలియుగే । ప్రథమపాదే । జంబూద్వీపే । భరతవర్షే భరతఖండే । మేరోర్దక్షిణదిగ్భాగే । శ్రీశైలస్యయీశాన్య ప్రదేశే। గంగాగోదావర్యోర్మధ్యదేశే।...గృహేసమస్తదేవతా మహేశ్వరచరణ సన్నిధౌ । అస్మిన్‌వర్తమాన । వ్యావహారిక చాంద్రమానేన......సంవత్సరే......అయనే ......ఋతౌ......మాసే......పక్షే......తిథౌ...... వాసరే। శుభనక్షత్రే। శుభయోగే । శుభకరణే । ఏవం గుణ విశేషణ విశిష్టాయాం శుభతిథౌ......గోత్రోద్భవస్య ......నామధేయస్య । మమక్షేమ । సమస్తాయురారోగ్య ఐశ్వర్యాభివృధ్యర్థం । ధర్మార్థకామమోక్ష । చతుర్విధ

ఫలపురుషార్థసిధ్యర్థం యిష్టలింగపూజార్థం । తదంగకలశా
రాధనం కరిష్యే॥

శ్లో. ఈశాన్యకలశస్యాగ్రే । పూర్వే తత్పురుష స్తథా । అ
ఘోరేరక్షణేచైవ । సద్యోజాతస్తు పశ్చిమే । ఉత్తరే
వామదేవశ్చ । మధ్యేచా పరంశివం । అధోభాగే.।
పరాశక్తి ।విశ్వాద్భాశివశేఖరే । సదూప్రంకలశాకారం
చిదూప్రం కలశస్థితం । మధ్యస్థ జలమానందం । రూపం
సాక్షాత్ శివాత్మకం ॥ తత్రస్థిజల ముత్కృష్టం సర్వ
తీర్థోత్తమోత్తమం। చిదానందం రసం సాక్షి । శివరూపామి
తత్కృతం॥

(ఈమంత్రము చదివి, విభూతి, గంధ పుష్పాదులు
కలశమునకు అద్ది, కలశముపై హస్త ముంచవలెను.)

క ల శ పూ జా మ ం త్ర ము.

శ్లో. కలశస్యముఖేరుద్రః । కంఠేవిష్ణుస్సమాశ్రితః । మూలే త
త్రస్థితోబ్రహ్మా । మధ్యేమాతృగణాశ్రితః । కుక్షౌతుసా
గరా స్సర్వే సప్తద్వీపా వసుంధరా । ఋగ్వేదోఽథయజు
ర్వేదస్సామవేదోహ్యథర్వణః । అంగైశ్చసహితాస్సర్వే కల
శేతుసమాశ్రితాః । ఆపోవాఇదగ్ంసర్వం । విశ్వాభూ
తాన్యాపః ప్రాణావాఆపః । పశవఆపోన్నమాపో । న్న
మృతమాపః । సమ్రాడాపో విరాడాపః । స్వరాడాపః
ఛందాగుష్యాపో యజూగుష్యాప। స్సత్యమాపస్సర్వా దేవ
తా ఆపో భూర్భువ స్సువరాప ఓం.

శ్లో॥ గంగేచ యమునే కృష్ణే గోదావరి సరస్వతి । నర్మదా సింధు కావేరి జలేస్మిన్ సన్నిధిం కురు ॥ కావేరీ తుంగభద్రాచ కృష్ణవేణీచ గౌతమీ । భాగీరథీచ విఖ్యాత పంచగంగాః ప్రకీర్తితాః॥

## ఆ వా హ న మం త్ర ము

ఆగమార్థంతు దేవానాంగమనార్థంతురాక్షసాంత్రతఘంటారవంకుర్యాత్ దేవతార్చనలాంఛనం॥ఘంటనాదం చేయవలెను మహాదేవాయ నమః అర్ఘ్యం, పాద్యం సమర్పయామి.

## అ భి షే క మం త్ర ము

ఓం పీఠస్యధరిత్రీ జలధరకలశంలింగ మహాకాశమూర్తిం నక్షత్రం పుష్పమాల్యగ్రహగుణకుసుమం నేత్రచంద్రార్క వహ్ని కుక్షో సప్తసముద్రభుజకరశిఖరం సప్తపాతాళ పాదం వేదంవక్రంశాస్త్రషడంగందశదిశవదనందివ్యలింగంనమామి॥

## శ్రీ రు ద్ర న మ క మ్

నమస్తే రుద్రమన్యవ ఉతోత ఇషవేనమః॥ నమస్తే అస్తుధన్వనే బాహుభ్యా ముతతేనమః॥ యాతఇషుశ్శివతమా శివంబభూవ తేధనుః॥ శివాశరవ్యాయా తవతయానో రుద్ర మృడయ యాతేరుద్ర శివాతనూ । రఘోరాపాపకాశినీ తయాన స్తనువాశ న్తమయా గిరిశన్తాభిచాకశీః॥ యామిషుం గిరిశన్త హస్తే శిభర్ష్యస్తవే శివాంగిరిత్రతాంకురుమాహిగ్ం

శ్రీః పురుషంజగత్ శివేన వచసాత్వా గిరిశాచ్ఛావదామసి యథానస్సర్వమిజ్జగదయక్ష్మగ్ం సుమనాఅసత్ అధ్యవోచదథి వక్తా ప్రథమోదైవ్యోభిషక్ అహీగ్ంశ్చసర్వాన్ జమ్భయన్సర్వాంశ్చ యాతుధాన్యః అసౌయస్తామ్రో అరుణ ఉతబభ్రు స్సుమజ్గలః యేచేమాగ్ం రుద్రా అభితోదిక్షు॥

## శ్రీ రు ద్ర చ మ క మ్

అగ్నావిష్ణూసజోషసే మావర్ధంతువాంగిరః ద్యుమ్నైర్వాజే భిరాగతం వాజశ్చమే ప్రసవశ్చమే ప్రయతిశ్చమే ప్రసితిశ్చమే ధీతిశ్చమే క్రతుశ్చమే స్వరశ్చమే శ్లోకశ్చమే శ్రావశ్చమే శ్రుతిశ్చమే జ్యోతిశ్చమే సువశ్చమే ప్రాణశ్చమే పానః॥

మృదుమంజులమోగ్యే ధాతేన నిర్మలేనచ శుద్ధభావశ్యవ స్త్రీ లింగస్య ద్రవమాచరేత్ (అనిపఠనచేయుచు ద్రవమునోత్తవలెను)

## వి భూ తి

శ్లో. భూలోకేయాని పుష్పాణి యాని పత్రి పలానిచ। తే షాంకోటిగుణంపుణ్యాం విభూత్యాది శివార్పణం॥ విభూతిసమర్పయామి॥

## గ ం ధ ం

శ్లో. మలయాచలసంభూతం సుగంధం ప్రియముత్తమం। కర్పూరాగరుసంయుక్తం చందనం పరిగృహ్యతాం॥ శ్రీచంద్రశేఖరాయనమః గంధం సమర్పయామి॥

## అ క్ష త లు

శ్లో.అక్షతాన్ ధవళాన్ దివ్యాన్ తాపసోత్తమపూజితాన్ అక్షతార్థం మయాదత్తం గృహాణపరమేశ్వర॥ అక్షతాన్ సమర్పయామి॥

పుష్పములు, దళములు పూజించుట.

శ్లో. త్రిదళం త్రిగుణాకారం త్రినేత్రంచ త్రియాయుధం।
త్రిజన్మపాపసంహారం ఏకబిల్వం శివార్పణం.

దక్షయజ్ఞవినాశానాం పార్వతీపతయేహరం। త్రిపుర పురదనుజ సంహారం ఏకబిల్వం శివార్పణం॥

దుష్కృత బ్రహ్మహత్యానాం పరనార్యాచ్చ సంగమం। అనేక పాపసంహారం ఏకబిల్వం శివార్పాణం॥

ఓం ఆత్మాయనమః ఆత్మలింగాయనమః
ఓం భవాయనమః భవలింగాయనమః
ఓం శర్వాయనమః శర్వలింగాయనమః
ఓం చంద్రశేఖరాయనమః గంగాధరాయనమః
ఓం నీలకంఠాయనమః గౌరీపతయేనమః
ఓం విష్ణువల్లభాయనమః ఇందుధరాయనమః
ఓం జగదీశ్వరాయనమః కైలాసవాసాయనమః
ఓం పరమేశ్వరాయనమః పార్వతీపతయేనమః

## ఘ ం టా నా ద ం

వేదాదివర్ణసంభూతం నాదరూపం నిరామయం। అజ్ఞా

నంచ హారం దేవం ఘంటానాదం,శివార్పితం॥ (గంట వాయించవలెను.

ధూ ప ము

వనస్పత్యు ర్భవైర్దివ్యైర్గంధాఢ్యై ర్గంధముత్తమం। ఆఘ్రేయ స్సర్వదేవానాంధూపోయం ప్రతిగృహ్యాతాం॥ శ్రీమహాదేవాయనమః ధూపంసమర్పయామి.

దీ ప ము

సాజ్యంత్రివర్తి సంయుక్తం వహ్నినా యోజితంప్రియం। గృహాణమంగళందీపం త్రైలోక్యతిమిరాపహం భక్త్యా దీపం ప్రియచ్ఛామి దేవాయ పరమాత్మనే। త్రాహిమాం నరకాద్ఘోరా ద్దివ్యజ్యోతిర్నమోస్తుతే (దీపంసమర్పయామి)

అ వ స ర నై వే ద్య ము.

శ్లో॥ ద్రాక్షఖర్జూరసంయుక్తం నారికేళఫలాన్వితం । మధుశర్కరసంయుక్తం నైవేద్యంపరిగృహ్యాతాం। అవసరనైవేద్యంసమర్పయామి॥ మహానైవేద్యం సమర్పయామి.

తాం బూ ల ము.

శ్లో॥ పూగీఫలైస్సకర్పూరై ర్నాగవల్లీదళైర్యుతం । ముక్తాచూర్ణేన సంయుక్తం తాంబూలంప్రతిగృహ్యాతాం । శ్రీమహాదేవాయనమః । తాంబూలంసమర్పయామి । సువర్ణమంత్రపుష్పంసమర్పయామి.

శ్లో॥ ఉరసాశిరసాదృష్ట్వా మనసావచసా తథా । పద్భ్యాంక రాభ్యాం కర్ణాభ్యాం ప్రణామోష్టాంగఉచ్యతే॥ యాని కానిచపాపాని జన్మాంతర కృతానిచ । తానితాని ప్రణ శ్యంతి ప్రదక్షిణ పదేపదే । పాపోహం పాపకర్మాహం పాపాత్మా పాపసంభవః। త్రాహిమాం కృపయాదేవ శర ణాగతవత్సల । అన్యథాశరణంనాస్తి త్వమేవశరంమమ। తస్మాత్కారుణ్యభావేన రక్షరక్ష మహేశ్వర॥ శ్రీసర్వేశ్వ రాయనమః। ఆత్మప్రదక్షిణనమస్కారాన్ సమర్పయామి.

శ్లో॥ యస్యస్మృత్యాచ నామోక్త్యా తపః పూజాక్రియాదిషు న్యూనంసంపూర్ణతాంయాతి సద్యోవందేతమీశ్వరం। మం త్రహీనం క్రియాహీనం భక్తిహీనం మహేశ్వరం యత్పూ జితం మయాదేవ పరిపూర్ణంతథాస్తుతే॥

సర్వేశ్వరప్రసాదం శిరసాగృహ్ణామి(పుష్పాదులుశిరస్సు న ధరించవలెను.)



వలయువారీ అడ్రసుకు వ్రాయవలెను :—

లక్కన మల్లికార్జునుడు,

టీచరు, బోర్డు యెలిమెంటరీ స్కూలు,

వల్లూరుపాలెము, తోట్లవల్లూరు పోస్టు.